ముపై భారమువైచి యటఁ గూర్చుండిరి. సాయంసమయమునకు మరల రామారావు వచ్చి సుదర్శనుని చేతి నాడిని బరిశీలించి యిఁక నతనికి భయములేదని చెప్పి యప్పటి వారికిఁ గొంచెము ధైర్యము నెలకొల్పెను. కమలా రామారావులును, సింగన్నయు నేదో విధమున భుజించిరి. కాని దుఃఖాతిరేకమున రుక్మిణి మాత్రము భుజింపలేదు. అది చూచి కమలా రామారావు లనేక విధముల బోధించి రుక్మిణిచే నన్నము తినిపించిరి. ఏమయినను నిరంతర దుఃఖ పీడితయగు రుక్మిణి రోగవర్జితయైనను దురవస్థకు భర్తను బోలుచుండెను. ఇట్లు నాల్గు దినములు గడచినవి. సుదర్శనుని స్థితి యింకను మాఱలేదు. సుదర్శనునకుఁ బ్రాణభయము లేదని తెలిసియున్నను, నెందులకైనను మంచిదని సుదర్శనుని బంధుగులకు, రుక్మిణి బంధుగులకును నతని స్థితిని దెల్పుచు రామారావు తంతివార్తల నిచ్చెను. ఇచ్చిన మూఁడవనాటికి బంధుగు లందఱును వచ్చిరి. అనసూయా రామావధానులు రుక్మిణి నోదార్చి యల్లుని కారోగ్యము గల్గ దేవతలకు మ్రొక్కుకొనుచుండిరి. శివరామారావును గోవిందరావును గూడ వచ్చి సుదర్శనుని స్థితికి వగచుచుండిరి. రామారావు వేయికన్నులవలెఁ గనిపెట్టుచుండి యెప్పటికప్పుడే రోగ నిదానమును గమనించి మందు మార్చి యిచ్చుచుండెను.

ఇట్లుండఁ గొన్నిదినములకు రుక్మిణి పూర్వపుణ్య విశేషమున సుదర్శనరావు రోగము క్షయోన్ముఖ మయ్యెను. ఆగకుండ దినము లరుగగానే రోగము మరలెను. అందఱు ప్రాణము లును గూటఁ బడినవి.

ఒకనాఁడు సుదర్శనుఁడు కన్నులువిప్పి చూచెను. తనపాదములను దొడలపై నిడుకొని యొత్తుచు, వేఁడిబాష్పములచేఁ దనయడుగుల దడుపుచు మూర్తీభవించిన శోకదేవత యనునట్లున్న రుక్మిణి కంటఁ బడెను. అతఁడామె వానవాలు పట్టలేక పక్కకుఁ జూడగా భూమి కవతరించిన ధన్వంతరివలె నున్న రామారావు చూపట్టెను. అతడు మెలకువతో నున్నట్లు తెలిసికొని యా సమయముననే బంధుగు లొక్కరొక్కరే లోనికి రాఁజొచ్చిరి. వారిని జూడగనే సుదర్శనుడు గతుక్కుమనెను. ఇట్టి విచిత్ర ప్రదర్శనము జన్మమధ్యమున లభించునని యతఁడనుకొనలేదు తన యాప్తవర్గము నిట్లు తెప్పించిన యారోగము తన కుపకారమే చేసినదని సంతసించుచు ముందుగా రామారావును గాంచి "మిత్రమా ! నాయవివేకమున నిను గొప్పయపకార మొనర్చితిని. క్షమింపు మని పల్కెను. అది విని రామారావతనితో "ఇందు నీవు చేసిన దేమి యును లేదు. దీనికంతకును గాలము కారణము. తక్కినవారిమాట కేమి ? ముందుగా సత్ప్రవర్తన యగు నీభార్య నోదార్పు మని పలికెను. సుదర్శనుఁ డెండిపోయిన చెక్కిళుల నుండి కన్నీరు కాలువలు గట్ట పాదములొత్తుచున్న భార్య చేయి పట్టికొని "ప్రేయసీ ! నాకు నీవు నిజమగు హితురాలవు. విద్యాంసురాలవు. పతివ్రతవు. అవివేకమున నీకుఁ దీఱని దుఃఖమును గల్గించితిని. మన్నింపుము. నీ భర్తను బొందిపిలలఁ బొడగాంచుము. నిజ మాలోచింప హైందవదాంపత్యమే దాంపత్యము. తక్కినవి సామాన్యము" లని భార్య నూరడించెను. ఆమె యధోముఖియై నులివెచ్చబాష్పధారలను గురియుచుట తప్ప ప్రత్యుత్తరమీయలేదు. అట్లే సుదర్శనుఁడు తన యపరాధమును మన్నింపుఁడని తండ్రి మొదలగువారి నందఱను బ్రార్థించెను. సుదర్శనుఁడు దుస్సహరోగముఖగహ్వరమునుండి విడివడుటయే కాక తన తప్పునుదెలిసికొని సత్పథగామియైనందుల కందఱును సంతసించిరి. తనహృదయాయఃపిండము పశ్చాత్తాపాగ్ని తప్తతచే మృదువై యప్పటి వారు నానావిధములఁబల్కు కారుపచనములను

సుత్తిదెబ్బలచేఁ గొట్టఁబడుటవలన సింగన్న మొగమెత్తి యెవ్వరితోను మాటాడఁజాలక యొక మూలఁ బడియుండెను.

కొన్నిదినములకు సుదర్శనుఁడు స్వస్థత గాంచెను. అతఁడు భార్యను స్వీకరించెను. రామారావుతోఁ దొంటిమైత్రి వహించెను. తక్కినపెద్దలనెల్ల నెక్కుడుగా నాదరించెను. అనంతర మతఁడు కొన్నిదినము లచ్చటనుండి తండ్రి యనుమతిచొప్పునఁ దన బలగముతో రాజమహేంద్రవరమునకుఁ గాఁపుర మేగెను. సింగన్న వారిని వెంబడించి తన తప్పును క్షమింపుఁ డని యందఱను బ్రార్థించి యనుమతి వడసి యగ్రహారమున కరిగెను. శ్రీనివాసరావు తన యల్లుని ప్రయత్నమునఁ దన న్యాయవాదిపట్టమును మరల స్వీకరించి, విశాఖపురమున నుండ సిగ్గుపడి కాకినాడపురమున నివసించెను.

AGR AHAARAMU Rs. 2-50

# అగ్రహారము:

తెలివితేటల యందును, యూహాపోహలయందును గురుబ్రాహ్మణ దేవతా భక్తియందును అగ్రేసరుడై, సాధువై, సాధుచింతనుడై, సాధుజన రక్షణ లాలసుడైన అగ్రహార వాస్తవ్యుడు అవధాని రామావధాని.

రాబడి లేకపోయినను డాబు, గర్వము, గోటు నీటు వేషము మొదలైనవి వీడుటకు వీలులేని ప్లీడరీవృత్తిలో వుండి, కుటుంబ భారమును మోయలేక తప్పటడుగులు వేసిన విశాఖపట్టణ నివాసుడు శ్రీనివాసుడు.

లోకుల యపవాదుల నమ్మి ఉత్తమురాలైన భార్యను వదలి పాశ్చాత్య నాగరికతకులోబడి విలవిలలాడిన ఉన్నత విద్యాధికుడు సుదర్శనరావు

అత్తమామల అరళ్ళలో నలుగుచు వారి ఆజ్ఞలను శిరసావహించుచు ఒక మూల భర్తమనసులో మెలగుచు, ఎవరికినినొప్పికలుగకుండ నడచుకొని ; చివరికి అత్తమామల ఆదరాన్ని అందుకున్న ఉత్తమనారి భద్ర:

ఏ ఎండకా గొడుగు పట్టుచు, ఒకరిమెప్పుకొరకు మరొకరి జీవితములో విషబిందువులు వెదజల్లిన అగ్రహారవాస్తవ్యుడు సింగన్న.

వీరి జీవితాల విచిత్రాలే అగ్రహారం ఇతివృత్తం.

పల్లెటూరు వాతావరణములోని విషపుగాలులు —

పట్టణవాసపు అట్టహాసములు —

స్వార్థంకోసం అమాయకులను బాధపెట్టిన లౌకికుల లౌక్యం —

ఇందులో స్పష్టంగా చిత్రీకరించబడినది.



పబ్లిషర్సు: అద్దేపల్లి అండ్ కో

సరస్వతీ పవర్ ప్రెస్

రాజమహేంద్రవరము